# కృతజ్ఞతాంజలి



ఇరువదేడులనుండియు నప్పుడప్పుడు రచించిన ఖండిక లన్నిటినిఁ జేర్చి "కళాసౌధము"ను నిర్మించి కళోపాసకుల కందఁ జేసితిని. రసగ్రహణ పారీణులిందులోని మేలి గొన ములను స్వీకరించి కళాసౌధములో విహరించి ఆనందించి నచో ధన్యుఁడను.

అర్థించినతోడనే నాపై వాత్సల్యముంచి "మున్నుడి" వ్రాసియిచ్చిన మైసూరు విశ్వవిద్యాలయ తెలుగు భాషా శాఖాధ్యక్షులు విద్వాన్ శ్రీ కె. సుబ్బరామప్ప, **M.A. B.Ed.** గారికిని, పౌరోహిత్యమున కంగీకరించిన సాహిత్యాచార్య మహోపాధ్యాయ శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ గారికిని, కావ్య కన్యకామణికి జీవితేశుండగుట కంగీకరించిన అఖిలభారత జాతీయ కాంగ్రెస్సు అధ్యక్షులు డాక్టర్ శ్రీ నీలం సంజీవరెడ్డిగారికిని నా హృదయపూర్వకమైన నమస్సు లందఁజేయు చున్నాను

కావ్యకన్యా దానోత్సవమునకు సూత్రధారులును — శాసన సభ్యులునగు — అనంతపురము జిల్లా పరిషత్ ఛేర్మెన్

శ్రీ ఎ. చిదంబరరెడ్డిగారికి ప్రేమాంజలి నర్పించుకొను చున్నాను.

కృతి సమర్పణోత్సవమునకు అధ్యక్షపీఠ మలంకరించుట కంగీకరించిన మహాకవి గడియారము వేంకటశేషశాస్త్రి, M.L.C. గారికి నా ధన్యవాదము లందజేయు చున్నాను. కృతి సమర్పణోత్సవ కార్యభారమును వహించి నాకు చేయూత నొసంగిన శ్రీ వి. లక్ష్మన్న, శ్రీ చౌదరి, శ్రీ ఐ. ఓబయ్య, సారస్వతసమితి అధ్యక్షులు శ్రీ వే. నరసింహారెడ్డిగారలకును, తదితర మిత్రులెల్లరికిని కృతజ్ఞతాంజలి నర్పించుచున్నాను.

శ్రీ లక్ష్మీకళాసౌధము
అరవిందనగర్
అనంతపురం

ఇట్లు,
విధేయుఁడు
తలమర్ల కళానిధి.



శ్రీ నీలం సంజీవరెడ్డి.

# కావ్య కన్యాదానము

దాస్య శృంఖలాబద్ధయై తల్లడిల్లు
భరతమాతను దరిఁజేర్ప భవ్యుఁడైన
గాంధిదేవుని యాజ్ఞచేఁ గట్టువడియు
త్యాగశీలుండవై తివి భోగిగాక!

సేవకుండవై స్వచ్ఛంద సేవఁజేసి
శాసనావళి నిర్మించు సభకు నీవు
సభ్యుఁడై విలసిల్లియు—సర్వజనుల
మన్ననల నందుకొంటివి మాన్యచరిత!

మంత్రి-ఉపముఖ్యమంత్రివై తంత్రి మెఱిఁగి
ముఖ్యమంత్రి వర్యుండవై సఖ్యమమర
ప్రజల యనురాగ నిధియునై భక్తి మెఱయ
ఆంధ్రమాతకు బిడ్డనై అలరితయ్య!

అఖిలభారత కాంగ్రెసు కధిపుడైన
నీదు సచ్ఛీల సంపత్తి నింపులలరఁ
గాంచి — కావ్యకన్యామణిఁ గాళ్ళు కడిగి
దానమొసఁగెదఁ జేకొమ్ము! ధన్యచరిత!

రాజకీయ ధురంధరా! రాలసీమ
రత్నమా! నీలమణి నీదు రమ్యమొదవు
నవ్యరోచుల వెదఁజల్లి దివ్యకృతికి
జీవితేశుండవగుము సంజీవరెడ్డి!!



# ము న్నుడి



రాయలసీమలో తెరమరుగున అజ్ఞాతంగా చాలమంది కవిపండితులున్నారు. వారికితగిన ప్రోత్సాహంలేకనూ — వ్రాసిన పుస్తకాలను అచ్చొత్తించుకోవడానికికూడ తగినంత ధనసహాయము లేకనూ—వెనుకబడి యున్నారు. అట్టివారిలో అనంతపురం జిల్లా పెనుగొండ తాల్లూకాకుచేరిన తలమర్ల గ్రామవాసి చిరంజీవి విద్వాన్ తలమర్ల కళానిధిగారొక్కరు. ఇప్పుడు ఈతడు అనంతపురంలోని రాజేంద్ర హైస్కూలులో తెలుగు పండితులుగా ఉన్నారు.

ఉపాధ్యాయ పండితుడుగా ఉంటూ కవిత్వం చెప్ప గలిగినవారు తక్కువగా ఉంటారు. శ్రీ కళానిధిగారు విద్వాన్ పరీక్షకు చదువకమునుపే కవిత్వంలో ప్రవేశం కల్పించుకొన్నారు. మధురకవి బెళ్లూరి శ్రీనివాసమూర్తి గారి వంటి సుప్రసిద్ధకవుల అండజేరి పరిశ్రమజేసినారు. ప్రకృతి ఒడిలో తన్మయత్వం చెందినప్పుడు తనకుతోచిన భావాలను ఖండికలుగా కూర్చినారు. ఇందులో కైతకీ ముకుళము—విహగవిలాపము—చూతవృక్షము — కుసుమవేదన — మధురఫలము — నాకేదిదారి — స్వాగతము అను ఖండికలు అన్యాపదేశాలు. ఈక్రింది పద్యం హృద్యముగా ఉంది.

మీకు లాయంబున మీ జెక్క పక్కలో
మీశాబకములతో మెలగలేదె!
మీనోట గఱచియు మెత్తని యాహార
మింపార దినిపించి మెచ్చలేదె!
అల్లారుముద్దుగా ననురాగ ముప్పొంగ
తరుశాఖలన్నియు దిరుగలేదె!
జిలిబిలి పలుకుల చిన్నారి పిట్టనై
మీయంక సీమల మెలగలేదె!

జీవసారపు జినుకుల జిలుకరించు
గానలహరిని దొరలుచు గరుణమాలి
తఱిమి సొడిచిన నాకేది దారియకట!
కఠినమానసులార యో కాకులార!

ఇక దర్శనార్థము — అన్వేషణము సుధానిధి—ఐక్యమై పోదు—భాగ్యమిమ్ము—అను ఖండికలు భగవంతునిగూర్చి భావ గంభీరంగా రచింపబడినాయి. ఈ క్రింది పద్యాలే యిందు లకు తార్కాణం.

రసదాడి గుంపులు మిసమిసలాడుచు
జెలువమ్ము గురియించి చెలగుచోట!
సరసంబులాడుచు సైరిక దంపతుల్
పొలములో విహరించి వెలయుచోట!

చివురుల మెసవుచు చిన్నారికోయిల
గానసరివంతిలో గ్రాలుచోట!
పసుల కాపరులెల్ల నిసుక తిన్నెలజేరి
చలుదులు గుడుచుచు మెలగుచోట!

నీదు లావణ్యమూర్తిని నెఱుగగోరి
వెదకి వేసారి యేకాంత వీధులందు
నెన్ని నాళులు చరియించి యేగ గలనో!
ఓ సుధానిధి! రాగదే! గాసి దీర్ప!!

సెంటు జాజిసొదలు చెలువార బుప్పించి
పరిమళమ్ము గురియు వనులయందు
ఏకతమున నీతో నేకీభవించియు
దిరుగు భాగ్యమిమ్ము! దరియు జేర్చి.

హతభాగ్యుడు—విషాదము—నాటిప్రేమ— విరహము— మొదలగు ఖండికలు మనస్సారవలచిన ప్రియావియోగాన్ని భరించలేక ఆవేదనబడి హృదయశాంతికొఱకు పాడుకొన్నవి. మచ్చునకీపద్యా లుదాహరిస్తూన్నాను.

ఓసఖీ! నీవియోగమ్ము నోపజాల
నీ జగమ్మును దిలకించి విసువుజెందు
నన్నుబోలిన హతభాగ్యు డక్కటకట!
ఉండినను మండినను యేమియుర్వియందు.

కాల్వగట్టున పొదలలో కాంతులొలుక
ఆడు మిణుగురు పురుగులే నాదరింప
నింబవాటిక చెంతనే నిల్చి నేను
బాష్పములు రాల్చనట్టి శర్వరులు గంటె!

ముద్దులొలికెడు సుద్దులు ముదముగూర్చు
మోము—సౌందర్య మెగబోసి మురిపె మెుండు
అధరములసొంపు దలపోయ నతివ నాదు
హృదయమట్టులే జడమౌను నాదుచెలియ!

'భాగ్యలక్ష్మి', ఇత్యాది ఖండికలలో రాయలసీమలోని పల్లెటూళ్ళ ప్రకృతి రామణీయకమును కనుపింపు గొల్పు నట్లుగ వర్ణింపబడింది. ఈరీతిగా అప్పుడప్పుడు తనకుతోచిన భావాలను వివిధ శీర్షికలతో రచించి యిప్పుడు ప్రకటించినాడు. రాయలసీమలో కళాసౌధాన్ని నిర్మించుటకు పూను కొన్నాడు.

కవిలేఖిని నుండి వెలువడిన యీఖండికలు భావోద్రేక పూరితములైనవి. ఆత్మానందంకోసం పాడినవి. ఇందులోని మాధుర్యాన్ని గ్రహించి ఆనందించడం సహృదయులైన పాఠకుల మానసిక అంతస్థులపైన ఆధారపడి ఉంటుంది. భావము లతిసుకుమారములై—మృదుమధురశైలితో రచన కొనసాగింది.

ఇతడు యీఖండికలేగాక కొన్ని వచనరచనలూ — నాటికలూ—వాల్మీకి రామాయణం దాదాపు 1500 పుటలు- నవనాథచరిత్ర—మధుకణములు—కథానిధి—అను గ్రంథాలను రచించినాడు. అమరమూర్తులు—కాళిదాసు అను ఉపవాచకాలనుగూడ రచించినాడు. కాని అన్నియు వ్రాతప్రతులుగానేనిల్చిపోయినవి. హరిజనోద్ధరణ — వర్ణాంతర వివాహాలు అనే నాటికలు—మరికొన్ని వ్యాసాలు వ్రాసి ఉన్నారు. దాతలెవరైన తగురీతిని సహాయపడినయెడల ప్రకటించుకోగలడు.

ఏసాహిత్య ప్రక్రియయొక్క శాశ్వత ప్రయోజనమును కాలమే నిర్ణయిస్తుంది. భావానుగుణమైన భాష గూడ యీతని కవిత్వంలో కనుపిస్తూంది. తగు ప్రోత్సాహమిచ్చిన పైకి రాగలడు. చిరస్థాయిగా నిల్వగల్గిన కావ్యాలనుగూడ వ్రాయగలశక్తిని భగవంతుడు ప్రసాదించుగాక!

శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఈ కావ్యకన్యకకు కృతిభర్తగ నుండుట కంగీకరించుట యీకవి సుకృతము. శ్రీ రెడ్డిగారు రాయలసీమవారు. యావద్భారతదేశ దృష్టియును నేడు వీరిపై లగ్నమై ఉన్నది. వీరి నేతృత్వం క్రింద దేశానికి సుస్థిరమైన భవిష్యత్తు ఏర్పడబోవ నున్నది.

జై హింద్.

విద్వాన్ కె. సుబ్బరామప్ప,
ఎం.ఏ. బి.ఇడి.
తెలుగు భాషాశాఖాధ్యక్షుడు,
మైసూరు విశ్వవిద్యాలయము

మైసూరు
1—12—59



# పౌరోహిత్యము

నేనొక పురోహితుడను. కవి కళానిధి పురస్సరహితు నకీసౌధ మీదలచెను. ఆహితప్రియు డౌననుట రసోచితము. నా సంవాదిరేఖ సంవిదుచితము. శ్రీ కళానిధులు చిరసుహృదులు. జనురంతరభావ సంవిదులు. సంవాది సంభాషానచేతస్కులు, సాహితీ సంకీస్సులు, తాదృశభావ భాగ్యశాలికి ఆత్మశీలికి సుధావాసిత కళాసౌధము ధీవాసము, సుధీవాసిత మొనర్చి వాస సముచితమని భావించుట బాగున్నది. నేను నట్టివాడనుగా పురోహితుడనై ప్రియహితవచనుడనగుదునని తలచితిని. ఆ హితవచను డహితవచనుడు కాజాలడు. ఆ ప్రియవచనుడును ప్రియవచను డౌ ననిపింప గలడు. ప్రచిత్తభావితలు మీరు నన్ను "ప్రీతః ప్రీతి ప్రముఖవచనం స్వాగతం వ్యాజహార" అనుడు.

కవిని మఱవి కావ్యమును భావభారమున భావించుటకు మనమింక సలవడవలసి యున్నది. అప్పుడు సుధానిధి సౌధసౌందర్య మాస్వాదింప వచ్చును. నాయీ వాచాసంపద కళాసౌధ సంభావనమునకు పూర్వరంగమగు గావుత.

శ్రీ తలనుర్ల కళానిధి "కళాసౌధము" ముక్తకబంధ రూపముకల కావ్యము. ఈ యొక్క కావ్యములో "తొలిపూజ, పల్లెపూలు—సుధానిధి" పేరిట మూడుకృతులున్నవి. ఈ కృతి త్రయమున ౫౭ ఖండికలున్నవి. వానిలో నింతలంతలయిన

పద్యములు ౨౨౦ కలవు. వీని నన్నిటిని సమన్వయ సూత్ర మున పట్టి "యేకకావ్య" మనవచ్చునో? అన్నియు భిన్న కాల రచనలు. అభిన్నతాను సంధానమిట్టివానియందు దాపశ్యకము. అసలు కవి హృదయమొక కావ్యము. కవియే కావ్యాకృతి నవభాసించును. ఇందున్న పద్యములన్నియు దాదాపు ముక్తకములు. ముక్తకము ఏకైక పద్యాకృతి. ఒక్కొక్క పద్యము చతుః పాదోపేతమై నిరూపణీయ చతుష్టయమునకు చతుష్పథ మిచ్చును. ప్రతిపద్యపాద చతుష్టయము నాల్గు పురుషార్థముల కేమి నాల్గుపాయముల కేమి ప్రతినిధీకృతమై సుప్రతీకము కావచ్చును. ఇందట్టిగుటను పాఠకులు భావింప గలుగుదురో? సామాన్యముగా ముక్తకములన్నియు స్వమాత్రపరిధిలో పూర్ణశోభ కలవి కావలెను. ఇందట్టి సౌందర్యమును భావకులు భావింతురో? ముక్తకముల ముక్త సౌందర్యముతో నుండుట భావ పండితులయిన భావకుల పని. ముక్తకములు ముక్తకాకృతి మాత్రమున లేవు. అవి యంతట సామాన్యముగా కులకము లయినవి. కులకరూపములకు కలానిధి కలారూపమిదలచి వేరు వేరు పేరుల బెట్టెను. ఇట్లు కృత సంకేతములు "తొలిపూజ"లో గొన్ని యున్నవి. కొన్ని "పట్టెపూలు"గా నున్నవి. కొన్ని "సుధానిధి" సూక్తములయినవి. ఈమూడును ముఖ్యభాగములు. వీనిలో ప్రతిభాగరూపమున నున్నవాని నన్నిటిని గ్రుచ్చి గ్రుచ్చి భావధారులు హారీకరింతురో? హారీకృతికి మనోహరాకృతి యుండవలయునని కలానిధి కపరిచితము కాదు. "కాచమును, మణిని, కాంచనమును ముద్గరాలయిన

కమనీయకన్య యేకసూత్రమున గూర్చినదని యొకడు నవ్వి నవ్వింపజేసెను. అశేషవిదుడు సూత్రసూత్రి శబ్దముని ప్రాణిని "శ్వయుసమవహోనామ తద్ధితే" అని యననే యనెను. కళానిధి యశేషవిదు లగుదురో? భావనిధులు పాఠకులు శేషవిదు లగుదురో? "తొలిపూజ"లో "పల్లెపూలు" పరిమళించి సుధీహృదిలో సుధీకృతములు కావచ్చునని "కళానిధి" భావించి యుండునో?

జీవుడాత్మ విరహమున లక్ష్యమునకు దూరమున నున్నాడు. లక్ష్యమధిగమింపవలెనని కోరిక పుట్టినపుడు తహతహపడి వేదన పొందును. ఆవేదన కవితాలాపమగుట దృష్టప్రసూతము. తనకు నిత్యసిద్ధముగా తనదిగానున్న పరిసర జగములో తాను పొందవలసినది లేదని యప్రాప్యమేదో ప్రాప్యమున్నదని పరిసరమునుండి పలాయన మొనర్చువాడేని కాని ఛాయావాదమును రహస్యవాదమును వేదనా వ్యంజకముగా కవి వాయెత్తి చెప్పుకొనుచున్నాడు. అది యొక జీవుని మొర. భగ్నజీవుని వేదన. భగ్నజీవుడు దేవునేని "మరచితే సుగుణాంబుధీ! మైత్రివీడి" అనును. అకాంక్షాత్మకమయిన కాంక్ష అన్యకాంక్షా రూపమయిన కాంక్ష కవికాంక్షలో కన్పడితీరును. పలనో కవికుమారులు నైరాశ్యము నిర్వేదము వెలువరించువారయినారు. "హతభాగ్యుడుండి నను మండినను పమి" అనుటయేమి? ఇందొక కావ్యకృతి "లేమి" యున్నది. ఇది కవియాత్మ బాధయా? "ఈ వాపోతలు విని జాలిపడు నందులు దివికేగినా"రని ముద్రా నాటక ముద్రిలో నున్నది. నేడా నాటకము లేకపోయినను వినెడు జీవులు లేరో?

కవి భావ కవితావస్తువు విశ్వగతమగును. కాని కతిపయసంవేద్యము కావ్యవస్తువుగా నప్పుడును. ఒకప్పుడొక కవి "సతీసహయోగ సుకృతీ! నీకిది తెలియదు. నీ విది చదువ వలదు" అనెను "సతీవియోగ ఖిన్నమతీ! నీకు కాగల యర్థమిందున్నది" అనుట యట్టిదే యగును. ఇట్టి కవితలకు పీఠమిచ్చు హృదయమున్నదా? యని సందేహాను లగువారును కతిపయ వ్యక్తులె యగుదురు. ఇట్టి కవితలో సర్గబంధమయిన కావ్యముద యింపదో? అని పలుకువారును కతిపయ సహృదయులె యగుదురు. సమన్వయభావ సమయము సంకేతించు కవితలు ఏకదాభావమిచ్చునే కాని యనేకదా భావమీయవు. అట్టివి సర్వదా భావన సే గలవో? లోకజనుల యాస్థ రేయటున్నదో యాయుగా ... వెలగించ జేయుట సకించనుల చాటులేని సుగంధములను ఆ ఉష్ణము పట్టువా రెవరు? కవితలోని నానా విధోద్గమముల కలయికలో సమన్వయమును సాధింపవలెనని కలానిధి సంకల్పమై యుండును. స్వాత్మానుసర్వస్వపద సృష్టి నిధిస్మృతము భావించు కలానిధికి హృదయంగమమయిన భావమున్నది. కవిపట్టుభాష, వాపట్టుభావము ప్రత్యేకతకలిగి యుండవలెనని యనుట యీనాటిదే కాదు. కావ్యమునందు కావ్యభాష యుండవలెను. లోకమునందు లోకభాష యున్నది. లోకము కావ్యము నాక్రమింపరాదు. కావ్యము లోకమున సంక్రమించును. బహుజన సులభపదని బంధనమున్న పలుకు పలుకు దనములేని పలుకొకటి కరపత్రములకు వలసినదే కాని కావ్యపాత్రములకు కావలసినది కాదు. చిరకాలముగా ఆంధ్ర మాధుర్యము చూరగొన్న ప్రాకృతగాథ కావ్యకథల కాక

రమ్మై యాకారమిచ్చినది. అయినను గాథానుకరణమున్న దననేల? అందరకట్టి వేదనలుండరాదో? "ప్రకృతి ప్రకృతి" యని యామ్రేడితమున నభిమానపడి వర్ణించు అలసులుకాని లాలసులు పశ్చిమ ముఖముగనేయుండి ప్రాచీగమన మొనరించిరి. ప్రకృతిని "ప్రేయసీ!" యని భావించు భావుకత వారల కున్నది. ప్రకృతికి కృతిలో నాకృతి కల్పించుటేల? అది విభావముగ నుండుటయే మేలు. కేవల విభావ వర్ణనమున తదన్యముల నూహించు నేర్పు విశిష్టులదేకాని కవి విశిష్టపథ ధర్మియగుట సముచితము. కాళిదాసు డొకడు ఋతుశోభావర్ణనపరుడై వర్ణించిన దంతయు అవి భావముగా నిలబడి యుండలేదు. కలానిధి కవి యన్యోక్తి ముద్రలందుకొని కవితా గూఢములను సహృదయ వర్గమునకై ఘాటించుట కన్పడును. కలానిధి కవియు "బీదలు బీదలని - బాధలు బాధలనియనుట మాట మాత్రమె యగునా? ఇది నవకాలమువారి యామోదమునందుటకయిన నవభాష నవలంబించుటయా? అకర్షకుడయిన కవి కర్షకపత్ని కవితలు పలుకుటయు నిట్టిదె. కవి వత్సలుడయిన హాలదేవుని గాథాకథలలో గ్రామీణ సామరస్యము కన్పడును. ఇందట్టివి పదపదమున నగపడిపడును. ఇటుపైనట్లు కాకపోవుట కవులను కవుల నభినందనీయము. బుద్ధిజీవులు స్వాతంత్ర్యజీవులు కాలేక శ్రీమదీవుల భావాలకు దాస్యమొనరింపవలసి వచ్చిన కాలములో నిది యేరీతియగునో? "నిబిడనైరాశ్య జలధిలో" కవి మునిగిపోరాదని, వాని నెవరు ముంచగూడదని, కావ్యపాఠక భాత్రితలందరు భావింతురు. కలానిధి కవి నిత్యకవితాభావుకుడు. "చాతకపులుగు" కాంచి, "సర్వభూరుహా

నికరముల్ పుష్పవతులాయె''నని, ''వత్సరవేకువ'' లోన యతి శ్రద్ధతో నియతి నియతితో భాసించుటయున్నది. ఇట్టి దంతయు నమతిక్రతముకాదు. అనవధాన విలాసము.

అద్విపదములయిన గీతములు లోకాత్మరీతుల నందుకో నక్కరకాదు. ఆ వృత్తజాతులు గీతములు గేయధర్మము కలవిగా గన్పడవచ్చునుగాని గేయము తెలుగులలో నిలుచు నని నేననను. స్వరూపా ప్రతిష్ఠానమయిన గీతము తెలుగుల హృదయమున హత్తుకొనలేదు. అది యెప్పటి కగునో? ఎప్పటికేని యిట్లే యగునో? నేనేమేని యనగలనని యనుట నేడు వలదు.

మిత్రనిధి కలానిధి బహుద్రష్ట బహుకృతి. తనకృతిని ఒక సుకృతికి. కృతిగానిచ్చి సంతుష్టుడు కాదలచెను. పాశ్చాత్య దేశములోని ప్రజాకూటములు కవితాకూటములగునని కవి జాతి కాంక్షించినది. ఆ కాంక్ష యీ కావ్య స్వీకర్తృ కాంక్షగా వచ్చుట సముచితము. పురోహితుడనై పౌరోహిత్య మును నేను నేనుగా నిట్లు నిర్వహించుకొంటిని. ఇది కలా నిధికి కలాసాధకృతికీ ప్రజాప్రతినిధి సుకృతికి హితము విహి తముకూర్చు గావుత.

ఆస్తు,

జె. మాధవరామశర్మ,

A. C. College,
GUNTUR,
16—7—60

Sahityacharya, Laxanika Siromani,
Sadasya; Sahitya Acadami & Academic council

# ఈశ్వరోపాసన

సర్వ ప్రకృతిని సృజియించి జగతియందు
ఆర్ద్ర కారుణ్యమున నన్ను ననుపమాన
ముగను, సృజియించినావు, నే ముగ్ధుఁడగుచు
నీదు మహిమాతిశయమును నెఱుఁగ లేక.

స్తబ్ధుఁడై పోయి యన్యంబుఁ దలపకిటులఁ
బ్రకులాడెద నోతండ్రి! పలువిధముల
నీదు సృష్టి వైచిత్ర్యమ్ము నెఱుఁగునటుల
నీ మహాద్భుత వర్తన లెఱుఁగునటుల.

కృపను వెదజల్లు మీశ్వరా! కావరమ్మ!
ప్రకృతిమాతకు బిడ్డనై పవలు రేలు
సృష్టి మర్మంబు నూహింప హృదయమందు
నూహఁ మెడమెడు, కారుణ్య మొలుకఁబోసి.

నవ్య పథమును జూపుము నాకు దేవ!
పద్యసుమములఁ గూర్చియు హృద్యమలర
నిదిగో! తొలిపూజ గావింతు నింపు లొలుక
స్వీకరింపుము నాప్రభూ! చెలువుఁ గలుక.

# మధుర కాంక్ష

జడత వహియించె హృదయమ్ము - చల్లనైన
ప్రకృతి మాధుర్యమే ననుబాసె ననుచు -
గాఢనైరాశ్య వనధిని గడవలేక
కాలమొకరీతి నెట్టులోఁ గడపుచుంటి.

చదల సొబగు నొసఁగు జలధరంబులఁ గాంచి
తెల్లఁ బూచి చెంత నుల్లమలర
పరిమళంబుఁ జల్లు వరిమళ్ళఁ దిలకింప
హృదయమందు మొలిచె మధురకాంక్ష.

శర్వరులను బయల చల్లగా విహరించి
గడచి చనినవెల్ల క్రిమతఁ దలచి
సహజ సృష్టిఁజూచి సర్వేశుఁ దలపోయ
హృదయమందు మొలిచె మధుర కాంక్ష.

# నా ఇచ్ఛ

ప్రకృతి పరిసర సీమలే భవ్యమనుచు
సైరికుని గానమే బలు శ్రావ్యమనుచు
సహజ సౌందర్యమే నాకు స్వాదు వనుచు
కృత్రిమములను నిరసింతు సృష్టి నరసి.

నిర్ఝరీ తీరములకేఁగి ఎఱుఁగరాని
వేగభీరపు స్వనములొ వినుచు నేను
అపరిమిత మోదడోల నానంద మొంది
కృత్రిమములను నిరసింతు సృష్టినరసి.

ముదురుకేదార తటముల మోహనముగ
గానమును సల్పి కవితను కౌగిలించి
జ్యోత్స్నలను విహరింతు నాలోకు మెఱయు
కృత్రిమములను నిరసింతు సృష్టినరసి.

## మ ఱ చి తే!

ఈ శరత్కాల నిశలలో నింపుఁ గులుక
నిర్మల నభమ్ముఁ దిలకించి నిన్ను దలచి
హృదయమున నాపరానట్టి వేదనలను
అనుభవించెదు ననునీవు నాత్మయందు
మఱచితే! సుగుణాంబుధీ! మైత్రి వీడి.

విమల కౌముది యందును సుమములందు
పూలు తావుల వెదఁజల్లు పొదల యందు
సుందరోద్యాన వనముల శోభలందు
నెల్ల ప్రకృతిని గాంచుచు నిన్నె దలచి
అశ్రుకణములు రాల్చెదు నన్ను నీవు
మఱచితే! సుగుణాంబుధీ! మైత్రివీడి.

# కైతకీ ముకుళము

కంటక నికుంజమునఁ బూచి గ్రాలుచుందు
వీవు కైతకీ ముకుళమా! నిన్నుఁ గొనంగ
కాంక్షఁ బొడమెను దారుణ కంటకములు
దరికిఁ జేరంగ నడ్డమై దారిమూయ.

విసిగి వేసారి వేసారి వెడలిపోయి
నిబిడ నైరాశ్య వార్ధిలో నీది యీది
ఆపగా రాని ఖేదమ్ము నావరింప
నసువులే త్యజియింపఁగ నాత్మఁ దలప

నెం దొ మరుదంకు రమ్ము లానంద మొప్ప
సౌరభమ్మును గొనితెచ్చు సౌరు మెఱయ
కాంక్ష నుదయింపఁ జేయుదే! కైతకంబ!
నిన్ను గైకొను తెరువెద్ది? ఎఱుఁగ జెపుమ!

# హతభాగ్యుఁడు

ముదురు వెన్నెల రాత్రులు మోద మొదవఁ
జేయు కేదారములశోభ చెవుల కింపుఁ
గొలుపు చాతక కూజితాల్ గలవు యిచట
నేదిఁజూచిన నైరాశ్య హృదయుఁ డగుదు.

ఈ యనంత సృష్టి నెచ్చోటఁ దిలకింప
హృదయ మించుకేని పదిల పడదు
అడలుఁ బొంది సతము నైరాశ్యమున మున్గి
తెరువుఁ దోపకిటులఁ దిరుగుచుండు.

ఓసఖీ! నీ వియోగమ్ము నోపఁజాల
నీ జగమ్మును దిలకించి విసువుఁ జెందు
నన్ను బోలిన హతభాగ్యుఁ డక్కటకట!
ఉండినను మండినను యేమి యుర్వియందు.

# లేమి

కుడువ నొకపూట కూటికే యెడరు గల్గె
దుర్భరంబైన దారిద్ర్య తోయరాశి
నెన్ని యీయహోరాత్రింబు లిటులఁ బుత్తు
నెన్ని యుపవాసములనుండు నెటుల మనుదు.

కూడు కూడోయటంచును కూన లేడ్వ
వీరి నిర్వేద భరము నేవినఁగ లేక
క్రుంగి కృశియించి పోవుదు హృదయమందు
దుర్భరంబాయె నేదరిఁ దోపదాయె.

కూలియో నాలియోజేసి కూడఁబెట్టి
గ్రాస మెట్టులో వేయుచు గడపు చుంటి
ఘోరరుగ్మత నను జేరె క్రూరమతితో
విధికిలోనైతి పిల్లల విధియు నెదియొ?

హా! సఖీ! నను దిగనాడి యరిగి తీవు
నాదు వాతను బడవైచి యనుఁగు సుతుల
కనులమూసుక నేఁగితే? కలికి నీవు
నాదువాతను బడవైచి యనుఁగుసుతుల.

జనని గతియించె నేనిటు సమసిపోతి
దిక్కులేని యీపాపల దీనపోష
కావ భారమ్ము నీయదే! కావు తండ్రి!
లేమికంటెను దైన్యంబు లేదు జగతి.

## విషాదము

ఈ విషాదంపు ఝరినెట్లు లీద గలనొ?
ఈ మనోరోగ జలధి నేనెటుల దాట
గలనొ? తను వంత కంతకుఁ గంది కుందె
జీవితంబె మహా దుర్భరంబు నయ్యె.

హృదయ ధనమెల్ల సమసెను తుదకు నిట్లు
జడుడనై పోతి ప్రేయసీ! సఖియ యనుచు
ఈ మనోరోగ జలధి నేనెటుల దాట
గలనొ? తన వంత కంతకుఁ గంది కుంచె.

# కవి

మొలక కేదారములఁగాంచి మురిసి పడుచు
ప్రకృతి పరిసర సీమలఁ బవలు రేలు
దివ్యగీతికా లహరినిఁ దేలియాడి
కవి కుమారకఁ బుత్తువు కాలమెపుడు.

సాంద్ర చంద్రికలందున సైకతముల
సెలల శాద్వల తటులందు చెలువుఁ గుల్క
సుమని కుంజమ్ము లందును సుఖముఁజెంది
కవి కుమారకఁ బుత్తువు కాలమెపుడు.

మొయిలు తునకలఁ దిలకించి ముదముఁ జెంది
చదల తారకామణులను చక్కనరసి
దివ్య గీతికాలహరినిఁ దేలియాడి
కవి కుమారకఁ బుత్తువు కాలమెపుడు.

# విహగ విలాపము

ఆకులాయమ్మ ఆ తరుశాఖ సొబగు
ఆ తుషారకణమ్ములు అచటి వింత
ఆయుషః కుమారిచెలిమి నకటఁ దలప
హృదయ మెచటికో పరుగిడు ముదము దక్కె.

అచట శాద్వల సీమలో నలరు సుమము
లంద చందమ్ము ఆ వనలతల శోభ,
మొలక కేదారమున కొంగ మూకఁ దలఁప
హృదయ మెచటికో పరుగిడు ముదముదక్కె.

ఎందొ తరుశాఖ నొకగూడు పొందు పఱచి
స్వైరజీవిత మెట్టులో జరుపు కొనుచు
నన్యులకు నెగ్గు నింతేని నరయకుండ
వనములందున జరియించు పక్షి నేను.

పక్షిననిఁ దలపోయక పంజరమున
బంధనంబున నునిచిరి పాపమనక
స్వైర జీవితమును భంగపఱచి రకట
కాంక్షలను తెగగోసిరి కఠిను లగుచు.

ఆకులాయమ్మ ఆతరుశాఖ సొబగు
ఆ తుషారకణమ్ములు అచటి వింత
ఆ యుషః కుమారి చెలిమి, అచటి పూల
కన్నులలరంగ నెన్నందు గాంతు నొక్కె!

కాంచుభాగ్యమె గలదొకో! కడకు నిట్లె
పంజరమ్మున నామేను పాడువడునొ!
నాకులాయమ్ముఁ దిలకింతు ననెడు కాంక్ష
మోసులెత్తునో! అట్టులే మోడు వడునొ!!

## అన్వేషణము

పసిమి వన్నెల నలరారి బాగుమీర
పండి యట్టాడు వరిమళ్ల వనుల యందు
పూవుటోవరు లందును పూవులందు
కర్షకార్భకు లందును వర్షమందు.

రమ్యమైనట్టి బీళ్ళ నారామ మందు
నిన్నె యన్వేషణము జేతు నెల్లవేళ.

అలస గతిఁబారు సొనలందు సెలల యందు
సైకతములందు కేతకీ ముకుళమందు
జంటఁ బాయని శారికాసఖ్యమందు
నీవు విహరింతు వనుచును నేను దలచి.

నీదు దర్శన భాగ్యంబు నెఱుఁగఁగోరి
నిన్నె యన్వేషణముఁజేతు నెల్లవేళ.



# సంయోగము

వచ్చుచును పోవుచుండెడు పథిక జనులు
నాదు నీరమ్ములను గోరిలి మోదమంది
బడలికలుఁ బాపుకొనుచును వెడలు చుండ
హృదయమున రేగు కాంక్షల నదుము కొనుచు.

పథిక జనులార! చల్లని హృదయులార!
కవి కుమారుని యెందేని కన్నులలరఁ
గంటిరే! మీరు తెలుపుడు కరుణతోడ
అధిక పుణ్యంబు చేకూరు ననుచు సతము.

ఎన్ని మారులో విలపించి నిన్ను దలచి
ఏడ్చి గడపిన దినములు ఎన్నిచనెనో!
పసుల కాపరులెల్లరు విసువుఁ గొనక
స్వాదువైనట్టి గానమ్ము నలుపు కొనుచు.

సైకతమ్ములఁ బవళించి శ్రమను బాపి
సంజవేళల విహరించి సంబరమున
నాదు తీరమ్ముఁ బాసియు నరుగుచుండ
హృదయమున రేగు కాంక్షల నదుముకొనుచు.

పసుల కాపరులార! యో భవ్యులార!
కంటిరే! మీరు కవిసుతుఁ గన్నులార
తెలుపుడీ! మీకు పుణ్యంబుఁ గలుగు ననుచు
ఎన్నిమారులో వాపోయి నిన్నుఁ దలచి
ఏడ్చి గడపిన దినములు ఎన్ని చనెనొ

పులుఁగు చెలులెల్ల వచ్చుచుఁ బోవుచుండ
నాదు నీరమ్ము నొసఁగుచు నాదరింప
మృదు మధురమైన గానమ్ము మోద మొదవఁ
జేసి - ననుబాసి యఱుఁగంగ చెలుడ నిన్నుఁ
ఎన్నిమారులోఁ! దలపోసి యేడ్చి యేడ్చి
గడపితిని యెన్నొ దినము లో కాల వశత.

కరుణ జనియించెనో! నీకు కవి కుమార!
మధు మాసమున నీకు మారెనా మనసు
నెలయేఱుపై నీకుఁగలిగెనా కరుణ
సంయోగ భాగ్యంబు సమకూరె మనకు
నాలోన నీవును నీలోన నేను
లీనమై పోదాము లెమ్మోయి సఖుఁడ!
సృష్టిమాధుర్యమ్ము చూర లాడుచును
లీనమై పోదాము లెమ్మోయి సఖుడ!
సంయోగ భాగ్యంబు సమకూరె మనకు.

# ప్రబోధము

అందమెగఁబోసి యారామ మందుఁ బూచి
నవ్యరోచుల వెదఁజల్లి భవ్యమొలుకు
ఆ సుమంబును దిలకించి యరయ రాని
మోద వారిధి నీదెదు ముదిత నీవు.

ఆవల కంచెలో వికసించి యలరుచుండు
సహజ శోభల వెదఁజల్లు సఖియ గనుమ
ఆ సుమంబును దిలకించి యరయ రాని
మోద వారిధిఁ దేలుము ముదిత నీవు.

కృత్రిమ సుమంబులను గాంచి మృదుల హృదయ
బేలవయ్యేదు సహజమై చెలువ మొలుకు
ఆ దయామయుసృష్టిని నరయరాదె
మేలిగౌనములె రాణించు కలికి యెందు.

కంటక నికుంజముననున్న గలదె వెలితి
అందమెగబోయు ఆరామ మందునున్న
ఎందునున్నను సుగుణంబు యెఱుక పడదె
కృత్రిమములెందు రాణించు మృదుల హృదయ.

మనుజ మాతృలు పెంచిన వనములందు
శోభ వెదఁజల్లు కృత్రిమ సుమముగాదు
సహజ సౌందర్య మొలికెడు శాద్వలమున
శోభవెదఁజల్లు సుమమును సుదతి గనుమ

సెలల శాద్వల సైకత స్థలములందు
శారికామిధునమ్ములు జంటఁ బాయ
కెల్ల వేళల విహరించు మల్లె పొదలు
ప్రసవములువిచ్చి పరిమళమ్మొసగు చుండు.

కాన్గ చెట్లలో పుష్పముల్ కాంతు లొలుక
జీ! యను నినదములుజేయు చెలువు మెఱయ
కీటక ప్రకరంబులు కెలన చెలియ
ప్రకృతి సౌందర్యమే బలు రమ్యమౌగ.

కనుల దనిపెడు పొలములు వనుల యందు
అల్లి బిల్లిగ నల్లి యానంద మొలుకు
తీవటెండ్లను సుమముల తేటఁదనము
శోభ వెదఁజల్లు కనుగొమ్మ సుదతి యదిగో!

ప్రకృతి నారాధనముసల్పి పవలు రేలు
కవికుమారిని ప్రేమించి కలిసి మెలసి
నిర్మలంబైన మనసుతో నెపుడుఁ దిరుగు
కవి కుమారునిఁ దిలకింపు కలికి నీవు.

# చూత వృక్షము!

కిసల యమ్ములు కళికలు కసుమ చయము
స్వాదు ఫలగుచ్ఛ వితతితో సొందరిమైన
వైభవమ్మునఁ దేలెడు వేళలందు
విహగ సముదాయమెల్లను విడువలేక.

నీవె యాధార మనుచును నిన్నుఁబాయ
కెల్ల వేళల నీమైత్రి నుల్లమందు
గోరి - మధుర ఫలములెల్లఁ గొఱికి తినెను
నాఁటి వైభవ మీనాడు దాటిపోయి.

మొద్దుబారిన నినుగాంచి వద్దఁజేరి
పలుకరించెడు పులుఁగులేఁ గలుగ వయ్యె
చూత వృక్షమా! ఇట్లైతె! చూడ చూడ!
ఏది శాశ్వతమని భువి నెన్నఁ నగునొ!!

షట్పదంబులు కీటక సముదయములు
నీదు చెలిమిని బాయక నెల్లవేళ
కుసుమ వాసనల్ గ్రోలెను కోర్కెఁపండ
నాటి వైభవ మీనాఁడు దాటిపోవ.

ప్రోడువారిన నినుజూచి మోదమంది
పలుక రించెడు తుమ్మెదల్ కలుగ వయ్యె
దరికిఁ జేరెడు కీటకాల్ జేరవయ్యె!
చూత వృక్షమా! ఇట్లైతె! చూడ చూడ!

నీదు శీతల చ్ఛాయలో నింపుమీర
పాంథ జనములు విశ్రాంతి వడసి వడసి
నీదు తీయని ఫలముల నెన్నొమెక్కి
దారిఁ బట్టుక జనియెడు వారలేరి?

నాటి వైభవ మీనాఁడు దాటి పోవ
మొద్దుఁబారిన నినుగాంచి వద్దఁజేరి
పలుకరించెడు నాథులే కలుగరైరి
చూత వృక్షమా! ఇట్లైతె! చూడ చూడ!

పసులఁ గాచెడు పిల్లలు విసువుఁ గొనక
రాలు రువ్వుచు పండ్లను రాల్చి కొనుచు
హాయి మీరగ భుజియించి - ఆటలాడి
మధుర గీతమ్ములనుబాడి మైత్రితోడ.

నిన్ను బాయరు అనాడు - ఇపుడు వారు
మఱచి పోయిరి గాబోలు! మదిని నిన్ను
ఏది శాశ్వతమని భువి నెన్నఁనగునొ!
చూత వృక్షమా! ఇట్లైతె! చూడ చూడ!!

# ప్రేయసీ!

నిండు జవ్వన మొలుకుచు నింపు లలరు
రాగి పొలముల విహరింతు రమ్యమొదవ
సంజ వేళల లాలించు చల్లనైన
మంద మారుతములు మేను మఱవఁజేయ.

ప్రేయసీ! నిన్నె స్మరింతు రేయిఁ బవలు
కన్ను లలరించు శాద్వల మున్నచోటు
అమిత సౌందర్య మెగఁబోయు నవలఁగాంచి
మధుర కూజిత మొనరించు ద్రుమానులందు.

విహగ సముదాయముల గాంచి ప్రియముఁ జెంది
ప్రేయసీ! నిన్నె స్మరియింతు రేయి బవలు.

# స్వాగతము

నాకు లా యమందు నతి ని గూఢమ్ముగా
పెరిగి పెద్దయైన సికము నేఁడు
రాలుఁ గఱగు రీతి రమ్యంబుగాఁ బాడ
జగమె లీనమయ్యె చల్లగాను.

తనువు పులకరెగసె తల దిమ్మ వట్టెను
ఎంత మధురగాన మెంత సొంపు
ఎట్లు దీనికబ్బె నెబ్బంగి విహగంబు
నణగఁ ద్రొక్కఁ జూతు ననుచు సతము.

వాయసంబు తఱిమి వనములలోఁ ద్రిప్పి
ముక్కుచేతఁ బొడువ నక్క యెందొ!
అమృత మొలుకు గీత మానంద మొందంగ
పాడు చుందు వీవు పరభృతంబ!

నవ వసంతోదయమ్మున నవ్య కళలుఁ
గురియ - చిగురు టాకుల మేసి గుబురు లందు
శాశ్విత్య వినదమ్ము సలుపుము చవులుఁ దేర
ఇడుమలకు నోర్చి యొనరింప నెందుగాని.

కార్య సాఫల్య మొనఁగూడు కలుగు కీర్తి
స్వాగ తంబిదె గొనుము - ఓ పర భృతంబ-
కాకి ఘోటుల కెటులనో కోకిలంబ!
ఓర్వ గలవు గాని మధువు లొలుకు చుండు.

దివ్య గానమ్ము నాపవు దీక్షఁ బూని
నైజ గుణమెట్లు మరలింప నగునొ! జగతి
చిగురు టాకుల మేపరీ! చెలువ మొలుక
పాడు పాడుము స్వాగతం బిడుదు నీకు.

# ఋతు శోభ!

చూతవాటిక లెల్ల శోభమై యలరారి
పల్లవితములయ్యె పడతి గనుమ
మామిడి చిగురులు మఱియొండు పక్షుల
కబ్బ పటంచును గర్వపడుచు
పరభృత రాజంబు బహు వినోదంబుగా
మధుర గానము సేసె ముదిత వినుమ
నింబ సుమంబులు నింపుగా సౌరభ
మెగఁబోసె వనముల మేలి మొంద

ప్రకృతి సౌందర్య మంజుల ప్రాభవమున
నవ వసంతోదయానంద మనుభవించి
విరుల యందలి పూఁదావి ప్రియము లలరఁ
గ్రోలు రోలంబ వితతుల చెలియ గనుమ!

తళతళ యెండలు తరులతా వితతుల
సుమకాండములనెల్ల స్రుక్కఁజేసె
పూర్ణమౌ జలముచే వర్ణింపఁ బడుచున్న
చెఱువు గుంటలు యెండి చెన్నుఁదఱిగె
విహగంబు లల్లదే వేడిగాడ్పులు సోకి
తృషగొని నోళ్ళను తెఱవ జొచ్చె
ఘర్మ బిందువులెల్ల గండ భాగములందు
రాలుచు కష్టించు రైతు వనిత

అల్లదే బారులన్ దీరి యుల్ల మలర
భూరుహమ్ముల చాయల వసున దీరి
నెమరు వేసెడి పశువుల విమల మతిరొ
గాంచు - గ్రీష్మర్తుశోభ వర్ణించ వశమె.

శ్రావణ జీమూత సంఘంబు లల్లదే
చదలెల్ల సభదీరె సఖియ గనుమ
దివ్య గానమ్మను తెప్పపైఁ దేలెడు
సైరిక పుత్రిల సఖియ గనుమ
శ్రావణాబ్దములతో జాబిల్లి దాగురు
మూత లాడెడు వింత ముదిత గనుమ
శ్రావ్య వినాదమ్ము సలుపుచు విహరించు
చాతకమ్ముల గాంచు చాన నీవు

వాడుబాఱిన బీళ్ళెల్ల పచ్చనయ్యె
ఎండు గుంటలు జలముచే నిండుకొనియె
సహజ లావణ్య మొలికెడు సర్వసృష్టి
వర్ష ఋతుశోభఁ దిలకించు పడతి నీవు.

పున్నమ జాబిల్లి పూర్ణమౌ రోచుల
వెదఁజల్లె జగమున వెలది గనుమ
శశికాంతు లల్లదే సస్యంబు పైబడి
సౌందర్య మెగఁబోయు సఖియ గనుమ

మంద మారుతములు మైసోకి పులకలు
చిగురించు చందమ్ము చెలువ గనుమ
అలసగతిని బాఱు ఆయూట కాల్వలో
శశి ప్రతిబింబముఁ జూడు సఖియ గనుమ

మధుర కూజిత మొనరించు మాలినులందు
విహగ సముదాయముల గాంచు వెలది యదిగో:
కనుల పండువు నొనరించు వనుల యందు
పండు వెన్నెల రాత్రులే పడతి సుఖము.

## ఓదార్పు

పల్లవంబులు విరిసరుల్ యుల్ల మలర
కమ్మ తావుల నీసెడు గాలితోడ
పిక కుమారిక గాన వాహినిని ముంచ
అపరిమిత సౌఖ్యడోల నుయ్యాల లూగి.

నట్టి - మధుమాస శోభనే నాత్మఁ దలచి
పరితపింపగ నేటికి ప్రాణ పదమ
శిశిర మింతయు దాటిన చెలువుఁ గులుకు
ఆ వసంతమె మరలను నరుగుఁ దెంచు.

వలదు ఖేదమ్ము సుంతైన వలదు చెలియ
ప్రకృతి నొక భంగి యెన్నండు బరగఁబోదు.

# ఏల పుష్పింపదాయె!

నవ వసంతోదయమ్మున నంద మొలుక
పండు టాకులు రాల్చిన పాదపములు
మోడువారిన లతలెల్ల మోసులెత్తె
మల్లె పొదరిండ్లు పుష్పింప నుల్లమలరె.

తీయ మామిళ్ల చిగురింపఁ దినుచు పికము
శ్రావ్యనినదమ్ము సలిపెను రమ్యగతుల
సర్వభూరుహానికరముల్ పర్వమొప్ప
పుష్పవతులాయె - తుమ్మెదల్ పూలలోని.

మధువు గ్రోలుచు స్వేచ్ఛగా మైత్రితోడ
ప్రియను బాయక విహరించె. వేపచెట్లు
పూలగుత్తులఁ దూగాడి చెలువ మొసఁగె
ఏల పుష్పింపదాయె నీ హృదయ కళిక.

# గిజిగాడు

నూతిలోనికి వ్రాలిన ఈత రెమ్మ
లకును - తూగుటుయ్యేలవోలె సఖియతోడ
నీకులాయము నల్లెదు నిపుణ మతితొ
ఓయి! గిజిగాడ! ధన్యుఁడ! వోయి జగతి.

ప్రణయరాజ్యపురమతోడఁ బవ్వళింప
అద్భుతాశ్చర్యములు గొల్పు నందముగను
ఎవ్వరెఱుఁగని యల్లిక నెటులొ యల్లి
గారడీవైతె! గిజిగాడ! కళను బెంచ.

ఓ కళారాధకుడ! యెంత యోపికోయి
పూనినావేదొ దీక్షను పూతమతిని
నీకళా రహస్యంబును నెఱుఁగనైతి
ఔర! గిజిగాడ! యెవరు నీ గురువు చెపుమ?

# కుసుమ వేదన

జనపద నివాసి లావణ్య సరసి నన్ను
వేణి భరమున దుఱిమెను ప్రియము తోఁచక
నాదు దురదృష్ట మదియేమొ? అవని రాలి
పథము నందునబడిపోతి పాంథులార.

పథిక జనులార పరిమళ భరముతోడ
కాంతి పొలివోవలేదింక కరుణఁబూని
త్రొక్కి పోవకుడయ్య! నే మ్రొక్కు లిడుదు
స్వాగతంబిత్తుఁ గొనుఁడయ్య! స్వాంతముబ్బ!

వేణి భరమున దుఱిమిన వెలది నన్నుఁ
దలచి - విలపించి సోలుచు తనువు మఱచి
ఎచట నున్నదొ! గొనిపోయి యెఱుఁగ జెపుడు
పథిక జనులార చల్లని హృదయులార.

# విరహము

శ్రావణాబ్దము లెల్లెడల్ చదల నలము
కొనియె - వానకోయిల మది కోర్కెలూర
గానమునుసల్పె నెచ్చెలీ! వనములందు
విరహమగ్గల మాయెను వెతలఁ బడితి.

ఉఱుములో మెఱపులొ నను నూరడించు
వనములో సెలయేరులోవద్దఁ జేర్చు
చిలుకలో కోయిలలొ నన్ను చేరఁదీయు
సుమనికుంజమ్ములో నను జూచి యేడ్చు.

# పాడియగునే!

ఈశరన్నిశలలొ సెలయేటి దరుల
ఱెల్లు పొదరిండ్ల కడఁజేరి యుల్లమందు
నీదు మూర్తినె స్మరియింతు నిరతముకట!
ఏల పలుచన జేసెదో! యెఱుఁగనైతి.

పండి పరిమళ మెగఁబోసి భవ్యమైన
ముదురు కేదార తటముల ముద్దులొలుకు
నీదు మూర్తిని స్మరియింతు నిరతమకట!
పరిభవానలమున ముంచ పాడియగునె!

# వియోగము

శయనింత మనుచును శయ్యను జేరంగ
నాచెంత కరుదెంచి నవ్వినట్లు
శయనించి అటునిటు నయమునఁ దిలకింప
నాముందు నిలుచుండి నవ్వినట్లు
కనుమూర్కు జనియింప ననువుగాఁ జనుదెంచి
నా కపోలములంటి నవ్వినట్లు
నిదురించి కలలను నింపుతోఁ గనుచుండ
నా కౌఁగిలందున నవ్వినట్లు

భ్రాంతి వీచికలందున నింతి నేను
తేలి పోవుదు నిరతంబు తెరువుఁ దోప
కకట! నాచెలీ! ప్రేయసీ! కలికి యనుచు
నిన్నెఁ దలపోతు కన్నుల నీరునింతు.

కేదార తటముల కేలీ విలాసముల్
చెలికాండ్రతోఁగూడి సలుపువేళ
సెలయేటి తటులందు చెలిమిమై విహరించి
కవితా కుమారితోఁ గలియువేళ
సాంధ్య రాగంబులఁ జక్కగా నరయుచు
శాద్వలమ్ముల గాంచు సమయ మందు
మామిడి చిగురుల మధుమాసమున మెక్కి
కోయిల మృదువుగాఁ గూయువేళ

మందహాసము మోముపై మైత్రితోడ
తాండవం బాడుచుండనో తలిరు బోఁడి
నీలవేణియు పిఱుదుల నీదులాడ
నాదు చెంతను నిలుచుండి నవ్వ దబల!

మృదుకపోలంబులను నొక్కి ముద్దుఁ గొనఁగఁ
కౌగిలందున నట్టులే కనులుమూసి
సోలి పోయిన నీదగు సొంపుఁ దలఁప
మఱపు రాదెన్నటికిని యో మగువ నాకు.

ముద్దు లొలికెడు సుద్దులు ముదముఁగూర్చు
మోము - సౌందర్య మెగఁబోసి మురిపె మొందు
అధరముల సొంపు దలపోయ నతివ నాదు
హృదయ మట్టులే జడమౌను నాదు చెలియ.

నీ వియోగమే నన్నిటు నెఱుఁగరాని
ఖేదమున ముంచె నెబ్భంగి హృదయ మింక
నిన్ను వీడునో! యెఱుఁగను నెలత నేను
నీ వియోగాబ్ధి నేరీతి నీదు దబల!

# తన్మయత

శీతల సమీరు నాడిలోన చెలువ మొలకు
గర్భిణీ రాగి పొలముల కనులఁ గాంచి
హృదయ మానంద సరసిలోఁ దేలియాడ
తన్మయతవార్ధిలు దేలిలా తలమునసంచొ!

చదల నలమిన జలధర చయము గాంచి
శార్వ్య నినదమ్ముఁ గురిపిరచు చాతకేజ
గాన మాలించి – పులకిత గాత్రమోఁ దగుచు
తన్మయత వ్రాలుదే శిలాతలము నందొ!

జీ! యనెడు నిస్వనంబును చెప్పులు పెక్క
నేకతము నిశి సగమగు వేళ లందు –
ప్రకృతి యొడిలోన సుఖవశించి పాడుకొనుచు
దన్మయత వార్ధిలుదే శిలా తలము నందొ!

# నాటి ప్రేమ

పూచి పరిమళ మొలుకఁ బోసెడు
నింబ వాటిక అందు నీరువురు
చేయి చేయిని గలిపినట్టిది
కాలమే కలవాయెగా.

తీయమామిడి వనము లందున
చిగురు టాకుల మేసి సొంపుగ
మధురగానము పికము జేయగ
ఆలకించిన కాలమే కఱవాయెగా.

మల్లెతోవరు లుల్ల మలరగ
పూల తావుల నెగయఁ జిమ్మగ
సంజ వేళల పొదల చేరువ
చల్లగను విహరింపమే.

పూల తేనెను మధుప జాలము
తనివి దీరగ గ్రోలు చుండగ
ఎంత సఖ్యమొ యెంత ప్రేమయొ
ఎఱుగ మనియెడు వాదవే.

పండి ధవళపు కాంతులన్
వెదజల్లు కంకులు
గాలి కట్టిటు తలలు నూపగ
నీదు మూర్తియె నాట్యమాడుగా.

నిండు జవ్వన మొలుకు చుండెడి
జొన్న చేలున మంచెపై నిటు
కన్నెనై కన్నీళ్ళు గార్చగ
కరుణ యుంచుక లేదుగా.

నిన్ను మనమున నెపుడు దలచుచు
ప్రిణయ తృషతో భంగ పడుచును
తనువు మఱతును తాళజాలక
గాంచవా కరుణింపవా.

నీవు లేమిని జగమె సర్వము
శూన్యమై కనుపట్టు చుండును
నిమిషమైనను నన్ను బాయని
నీవు నెటులున్నాడవో.

నాటి ప్రేమయు నాటి సుఖములు
నాటి నవ్వులు నాటి బాసలు
ఎట్లు మఱచితో నెట్టులుంటివో
ఎఱుగనైతివి నెచ్చెలీ!

గడచి పోయిన కథలు నామది
మాయజాలక బాధ వెట్టగ
ఎన్నినాళ్ళని యిటుల మెలగుదు
ఏమి జేయుదు నెచ్చెలీ!

# మధుర ఫలము

కంటక నికుంజమునజేరి గహనసీమ
నతి నిగూఢమ్ముగా దాగి యలరుచున్న
నీదు జాడను వెదకుచు నెటులొ వచ్చి
రసిక హృదయుండ నీస్వాదు రసముఁ గ్రోల

గంపె దాశతో నిను గానఁ గోరముఁ జూచ
క్రూర కంటక చయమెల్లఁ జేరి తనువు
కశిలావేదిపై నిట్టు విసువుఁజెంది
గాఢ నైరాశ్య వనధిని గడువలేక

మధుర ఫలమ నిన్ను మోదమారఁ జేకొను
భాగ్య మింక నేను బడయఁ జాల
గలనొ - లేదొ యనుచుఁ గన్నీరు రాల్చుచు
గహనసీమ యుండె గడపు దింక.

# కోకిల

పల్లవంబుల మెసవుచు వనుల యందు
నవ వసంతో దయమ్మున నవ్యకళలుఁ
గురియు - గీతి కాలహారిని పౌరలజేసి
లోక మగ్గింపఁ జేసితో! కోకిలంబ!

ఆ వసంతము నిను వీడి యవలఁజనియె
ఏది సుకుమారమైనట్టి మధురగాన
మిపుడు మృదులత్వమునుబాసి ఝుంపు ఛెడితె
ఏల పాడెదుగానమ్ము చాలు చాలు.

# బాష్పములు

కాల్వగట్టున పొదలలో కాంతు లొలుక
ఆడు మిణుగురు పురుగులే నాదరింప
నింబ వాటిక చెంతనే నిల్చి నేను
బాష్పములు రాల్పనట్టి శర్వరులు గలవె.

వాన చినుకుల కొఱకునై వనములందు
ఆలపించెడు చాతక పులుఁగు గాంచి
నాత్మ కాంక్షల యొడిలోన నూగి యూగి
బాష్పములు రాల్పనట్టి శర్వరులు గలవె.

నిశిసగ మగుసరికి నెచటనో! సొంపగా
సైరికుండు పాడ సైకతములఁ
తనువు మఱచిపోయి వనులలోఁ దిరుగుచు
వనరు చుందు నకట! పవలు రేలు.

# ఏ శకుంతమ్ముఁ దెల్పునో!

మాలతీలత వికసించి మరులుఁ గొలుప
విరియఁ బూచిన చేమంతి విరుల నడుమ
పండి బంగారు చాయలఁ బరగుచుండు
శాలిభూముల విహరించి చల్లనైన.

ఈశరన్నిశీథమ్ములో నిటుల నేను
అశ్రు బిందువులను రాల్ప నకట! నీకు
ఏ విహంగముఁ దెల్పునో! యెఱుఁగనైతి!
జెల్లు పొదరిండ్లు పుష్పించి యుల్లమలర.

కంచెలను బూచి సుమములు కళలుఁ జింద
అమల సౌందర్య మొలికించు నన్ని దిశల
ఈ శరన్నిశీథమ్ములో నిటుల నేను
కన్నులను నీరు నింపంగ కరుణఁ బూని.

ఏ శకుంతముఁ దెల్పునో! యెఱుఁగనైతి
ఈశరన్నిశీథమ్ములో విసువుఁ జెంద
శిశిర దీధితియైన నాగాసిఁ జూచి
పరిసరంబుల విహరించు పక్షి తతుల.

తెలుక పలుచునో! లేదొకో! యెఱుఁగనైతి
ఏ శకుంతము దెల్పునో! యెఱుఁగనకట.

# దర్శనార్థము

పరిమళంబును గురియించు విరుల దరిని
చిగురు గాలులు లాలించి సేదఁ దీర్ప
పాడు హృదయమ్ము నిన్నెడఁ బాయలేక
గాఢ నైరాశ్యమున మున్గి కలతఁ జెందు.

ఏకతమ నిశివేళలో సైకతమున
ఘోర నైరాశ్య లహరిని దొరలి దొరలి
చదల నళిమిన జలధర చయము రాల్చ
జలకణంబులఁ దిలకించి జాలువారు.

బాష్ప కణముల దోసిటఁ బట్టి నీదు
దర్శనార్థము వేచితి తటము లందె!!



# సుధానిధి

౧

రసదాడి గుంపులు మిసమిస లాడుచుఁ
జెలువమ్ముఁ గురియించి చెలఁగు చోట
సరసంబు లాడుచు సైరిక దంపతుల్
పొలములో విహరించి వెలయు చోట
చివురుల మెసవుచు చిన్నారి కోయిల
గానసవ్రిపంతిలోఁ గ్రాలుచోట
పసుల కాపరులెల్ల నిసుక తిన్నెలఁ జేరి
చలుదులుఁ గుడుచుచు మెలఁగుచోట

నీదు లావణ్యమూర్తిని నెఱుఁగఁ గోరి
వెదకి వేసారి యేకాంత వీధు లందు
నెన్ని నాళులు చరియించి యేఁగఁ గలనొ!
ఓ సుధానిధి! రాగదే! గాసిఁ దీర్ప!!

౨

వరిపొట్టు విరిచెండ్లు పరిమళ మొలుకుచు
భవ్యమై యలరారు దివ్య వనుల
కదళీ వనంబులు కనువిందుఁ గొలుపుచు
గొలలతోఁ దూగాడి వెలయుచోట!

సుమములఁ దొడఁగియు శోభమైతనరారు
పూఁదీవ లల్లిన పొదలనడుమ
పిచుకలు జంటలై కిచకిచ మనుచును
చెలిమై విహరించి చెలఁగుచోట

నీదు లావణ్యమూర్తిని నెఱఁగఁగోరి
ఈశ్వరన్నిశీథమ్ములో నేకతమున
విసిగి వేసారి వేసారి వేచితిచట
ఓసుధానిధిః రాగదేగాసిఁ దీర్ప!!!

౩

శిశిరమున పాదపమ్ములు పసిమిఁ దనరు
జీర్ణపత్రావళిని రాల్చి చెలువుఁగులుక
కూటిగుడ్డకు నలిగిన కూనయొకతె!
తనువు మఱచియు నిదురలో మునిఁగిపోయి

పండుటాకుల సెజ్జపైఁ బవ్వళింప
జాలిగుండెతోఁ దిలకించ జాలకేను
బాష్పములు రాల్చి పేదల బాధలెపుడుఁ
దీరునోః యని వాపోయి దారిలేక

ప్రకృతి యొడిలోనఁదీయగా పాడుకొనుచు
హర్ష పులకితగాత్రుఁడై యలరి యలరి
స్వేచ్ఛమెయి కాలమెట్టులోఁ బుచ్చుచున్న
నాదు జీవిత వీధుల నక్కటకట!

కంటక నికుంజములుఁ ద్రోచి కరుణమాలి
నిబిడనైరాశ్య లహరిని నీదఁజేసి
తెరమఱుంగునఁ జరియించు తెఱఁగదేల?
రమ్ము! ఓసుధానిధి! వేగరమ్ము మొదవు

నీదుయుపగూహనమ్ములో నొదుగఁజేసి
సతము లాలించి బేలించు సంతసమున.

## ఐక్యమైపోదు!

ఈశరత్పూర్ణిమా జ్యోత్స్న నింపు లలర
వంకదరి తెల్లుఁబుష్పించి వన్నెలొలుకు
ముదురుకేదార సీమలు ముదముఁగొలుప
సాంధ్యవేళల వికసించి సౌరుఁజిలుకు

బీరపూవులఁ దిలకించి ప్రియముఁదనర
సృష్టి సౌందర్యరాశిలోఁ జూరలాడి
ఎందు దాగితివోయని మందమతితో
శర్వరుల నేకతమ నీదు జాడలరయు

కవికుమారుని దీవించి కరుణతోఁడ
బుజ్జగించియు లాలించి పజ్జఁజేర్చు
మైక్యమైపోదు నీయందె! యనవరతము
బుజ్జగించియు లాలించి పజ్జఁజేర్చు!

# గోమాత!

ఘోరము త్రైదువలు నిన్ను గౌరవించి
పూజలొనరించు చుందురే పుణ్యచరిత!
ఎంత ధన్యాత్మురాలవో! యెఱుఁగరాదు
సాధుగోమాత! సౌశీల్య సాధుచరిత!

స్వాదుదుగ్ధంబు నొసఁగుచు స్వాంతమలర
దేశ సౌభాగ్యరాశివై తేజరిలుచు
భారతీయుల నోముల పంటగాఁగ
సాధుగోమాత! వెలయుదే! సాధుచరిత!

# భాగ్యలక్ష్మి

గ

కృకవాకములుఁగూసె వేకువజామాయె
దుగ్ధముల్ పిదుకంగ ముగ్ధలెమ్మ
తెలతెలవారెను మెలమెల్ల మేల్కాని
దధిభాండమును జిల్కఁ దరుణి లెమ్మ
కిలకిలారవముతోఁ బులుఁగులు రెపరెప
నెఱకలార్చుచు మేతకఱుఁగ జొచ్చె
లేఁదూడ పలుపును లేమరో వదలించి
క్షీరమ్ముఁ గుడుపుమో శీలవతిరో!

దేశ దారిద్ర్యమును బాప దీక్షఁబూని
సైరికునకీవె చేయూతనరగ నొసఁగి
భాగ్యలక్ష్మివై వెలయుచు భవ్యమలర
కలుష మెఱుఁగని గృహిణివై గ్రాలెదమ్మ!

౨

పసిమి వన్నెల నలరారు కుసుమములను
కందిచేలెల్లఁ దొడఁగియుఁ గ్రాలుచుండ
కనులఁదనుపుచు శ్యామల కళలుఁజిందు
పెనగ చేలతటంబుల చెలులఁగూడి

కాఁపు చెలియరో! స్వేచ్ఛగాఁ గలయఁ దిరిగి
జీవరాసుల పాలిట చెలమ వగుచు
పంటలక్ష్మికి కేలోడ్చి భవ్యమొలుక
సైరికుని భాగ్యలక్ష్మివై సరగవెలసి

కలుషమెఱుఁగని గృహిణివై గ్రాలెదమ్మ!
ఎంత ధన్యాత్మురాలవో! యెఱుఁగరాదు.

౩

కర్షకుడు చెమటోడ్చియుఁ గష్టమొంద
జాలిగుండెతో బాష్పముల్ జాలువార
చదల నాచ్ఛాదితములైన జలధరముల
శోభఁ దనరారఁదిలకించు సుదతినీవు

పతికి చేయూతనొసఁగెదు భాగ్యలక్ష్మి
జీవరాసుల బోషింప చెలమవీవె
సైరికుని భాగ్యలక్ష్మివై సరగవెలసి
కలుషమెఱుఁగని గృహిణివై గ్రాలెదమ్మ!

రామణీయక మెగఁబోయు రాగిపొలము
విమల సౌందర్యమునఁదేలి వేడుకలర
సుంకుమోసిన కంకుల శోభగాంచి
పంటలక్ష్మికి కేల్మోడ్చి భవ్యమలర

దేశ దారిద్ర్యమునుబాపు దేవివగుచు
దీన జనముల పాలిట దీపమగుచు
జీవరాసుల పాలిటి చెలమవగుచు
సైరికుని భాగ్యలక్ష్మివై సరగవెలసి

కలుషమెఱుఁగని గృహిణివై గ్రాలెదమ్మ!
దీన జనములపాలిట దీపమగుచు!

# సుధానిధి

శాలిభూములు శ్యామల కళలుఁ జింద
కంచెలనుబూచి చెలువమ్ము మించుచుండు
కాశిరతనంపు వల్లరుల్ కనులఁ దనుప
నూత్న కాంక్షాపరంపరల్ నూగులాడి

నయన పర్వమ్ముగాఁ బూచి ప్రియము కొలుక
కెళ్లు పొదరింట్లఁ బులకించి - యుల్ల మలరఁ
జేయు నెలమేటి తటులందు చెలిమి సేసి
తఃపరన్ని శీధమ్ములు సటులొగదపి

ప్రకృతి యొడిలోనఁ దీయగాఁ బాడుకొనుచు
హర్షపులకితగాత్రుఁడై అలరి సాబి
స్వేచ్ఛమెయి కాలమెట్టులోఁ బుచ్చుచున్న
నాదు జీవిత వీథుల నక్కటకట!

కంటకనికుంజములఁ ద్రోచి కరుణమాలి
నిబిడనైరాశ్య లహరిని నీడఁజేసి
తెరమఱుంగునఁ జరియించు తెఱగదేమి?
రమ్ము! ఓ సుధానిధి! వేగ రమ్యమొసప్ప

నీదు యుపగూహనమ్ములో నొదుగఁజేసి
సతము లాలించి పాలించు సంతసమున.

# చను దెమ్మ!

నింబసుమములు బెల్లంబు నిదిగొ జేర్చి
పచ్చనాకులతోరణాల్ నిచ్చగూర్చి
నారికేళంబు సుమములు నగరుధూప
దీప నైవేద్యములొసంగి దీప్తులెసఁగ

విజయవత్సర వేకువజా విమలమతితో
నీదు పదపంకజమ్ముల కింపులలర
నర్ఘ్యమొసఁగెదఁ జనుదెమ్మ! అతిరయమున
కవికుమారుఁ డొసంగెడు కాన్కఁగొనఁగ

## మస్తాజా వలీ!

ఏమిఫలమపేక్షించియో! విమలహృదయ
శాంతి శాంతిః యటంచును శాంతమూర్తి
నూతన తటాక పురమున నోమహాత్మ!
నిశ్చల సమాధి నిష్ఠలో నిలిచి తయ్య!

నిశ్చల సమాధి నుండియు నిగమ సార
మొలుకఁ బోయుచు వెలయుదే మునివరేణ్య!
ఏ గభీరపు స్వనములో? యెల్ల దిశల
నీదు పరిపర సీమల నెగయఁ జిమ్మ.

ఈః వివిక్త వీధుల నేదొ! నెఱుక పరచి
ప్రకృతి యొడిలోన హాయిగాఁ బవ్వళించి
ధ్యాన నిష్ఠా గరిష్ఠుఁడై ధన్యుఁడైన
స్వామి మస్తాజావలీ! నీకు స్వాగతంబు.

కొత్త చెఱువున విలసిల్లి కోరి వచ్చు
భక్త తతిబ్రోచి దరిఁజేర్చి బంధ ముడిపి
జన్మ పావన మొనరించు సాధు వర్య
స్వామి మస్తాజావలీ! నీకు స్వాగతంబు.

# నాకేది దారి

మీకులాయంబున మీఁదెక్కి పక్కిలో
మీ శాబకములతో మెలఁగ లేదె!
మీనోటఁ గఱచియు మెత్తని యాహార
మింపారఁ దినిపించి మెచ్చలేదె!
అల్లారు ముద్దుగా ననురాగ ముప్పొంగ
తరుశాఖ లన్నియుఁ దిరుగలేదె!
జిలిబిలి పలుకుల చిన్నారి పిట్టనై
మీయంక సీమల మెలఁగ లేదె!

జీవసారపుఁ జినుకులఁ జిలుక రించు
గానలహరిని దొరలుచుఁ గరుణమాలి
తఱిమి పొడిచిన నాకేది దారి యకట!
కఠిన మానసు లారయో కాకులార!!

ఉగ్గు పాలతోఁ బుట్టియు నిగ్గదేరు
నాదు తీయనిగానమ్ము నాలకించి
ఇట్టి నాయెడ నేలకో? ఈర్ష్యఁబూని
తఱిమి పొడిచిన నాకేది దారి యకట!

పిక కుమారిక రారమ్మ! ప్రేమఁ జిలుక
స్వాదు గానామృతంబులో నీదఁజేసి
మనసు కాహ్లాద మొనగూర్చు మహహా యనక
తఱిమి పొడిచిన నాకేది దారి యకట!

# సుధానిధి

చేరువను నింబ వృక్షంబుఁజేరి సతము
జంటబాయని పులుఁగుల సఖ్య మరసి
అలస గతిఁబాటి స్వార్థమ్ము నవలఁద్రోసి
సస్య పుంజమ్ములను బ్రోచి చల్లనైన.

తత్త్వబోధను కుల్యామ తల్లి సలుపఁ
బ్రకృతి యొడిలోనఁ దీయగాఁ బాడుకొనెడు
నాదు జీవిత వీధుల నక్కటకట!
కంటక నికుంజములఁ ద్రోసి కరుణమాలి.

నిబిడ నైరాశ్యలహరిని నీదఁజేసి
తెర మఱుంగునఁ జరియించు తెరగదేమి?
రమ్ము! ఓ సుధానిధి! వేగ రమ్య మొదవు
నీదు యుపగూహనమ్ములో నాదుగఁజేయ!

# భాగ్యలక్ష్మి

కూలీలకెల్లను గుండె దిగులుగాఁగ
నా దర్శప్రాయమై - అలరి యంరి
నడికట్టు బిగియించి నలుగుర కంటెను
ముందుగా బిరబిరమునను వెళ్లి

ఉత్సాహముదయింప ప్రోత్సాహ మొసఁగుచు
పాటక స్త్రీలతోఁ బాడుకొనుచు
కలుపును దీయించి కలకల నవ్వుచు
హాస్యోక్తు లెన్నియో నాడుకొనుచు

కూలి చెలులతో స్వేచ్ఛగాఁ గూర్మిఁదనర
గృషిని సలిపెదవమ్మరో! కృపను వెలయ
సైరికుని భాగ్యలక్ష్మివై సొరుఁజిలికి
కలుషమెఱుఁగని గృహిణివై గ్రాలెదమ్మ!

నెత్తికాయలుఁ గాయంగ నిరతమీవు
చలిది గంపనుమోయుచు శ్రమలకోర్చి
బురదమళ్లను దున్నెడు వరునిజేరి
మధుర రసమొల్కు పలుకుల మమతఁబెనుప

పతికి చేయూతనొసఁగిన ఫలముదక్కె!
గాదెలను ధాన్యరాసులు గ్రాలదొడఁగె
దేశ దారిద్ర్యమునుబాపు దేవివగుచు
సైరికుని భాగ్యలక్ష్మివై సంతసించు

ధన్యురాలవు నీవెగా పుణ్యవతిరో!
జీవరాసుల పాలిటి చెలమవనుచు
నిన్ను యాశీర్వదింపంగ చెన్ను లొలయ
నదిగో! సంక్రాంతలక్ష్మియూ నరుగు దెంచె!

## కార్మిక సఖుఁడు

మటమట మండెడు యెండలొ
జొటజొట చెమటోడ్చి దొరచోద్యముఁగాఁగన్
పటపట రాళ్లను గొట్టుచు
కటకట! కష్టింతువయ్య కార్మిక సఖుడా!

అడుగులు బొబ్బలు రేఁగగ
బడుగగు దేహంబు యెండబారికిసుర్కిక్కన్
ఇడుమలఁ గుడుచుచు సోలుచు
కడుదీనతఁ గుందెదౌర కార్మిక సఖుడా!

## సుధానిధి

మల్లెటోవరి పుష్పించి యుల్లమలర
విరిసి పరిమళ మెదజల్లు విప్పపూలు
పసిడి చాయలఁబరగెడు కుసుమచయము
కిసలయమ్ముల కళికలు కేలఁదాల్చి

చిఱుతప్రాయంబుననె నన్ను జేరనున్న
ఘోరరుగ్మత నావలఁ బారఁదోల
నూతనాబ్దమ్ము నర్చింప నువ్విళూరి
ప్రకృతియొడిలోనఁ దీయగాఁ బాడుకొనుచు

నాదు జీవిత వీధుల నక్కటకట!
కంటకనికుంజములఁ ద్రోసి కరుణమాలి
నిబిడ నైరాశ్యలహరిని నీదఁజేసి
తెరమఱుంగునఁ జరియించు తెఱఁగదేల?

రమ్ము! ఓసుధానిధి! వేగ - రమ్యమొదవు
నీదు యుపగూహనమ్ములో నాదుగఁజేసి
సతము లాలించి బేలించు సంతసమున
రమ్ము! ఓసుధానిధి! వేగరమ్ము! రమ్ము!!

# సద్గురుమూర్తి

విజ్ఞాన యోగీశ! సుజ్ఞాన నిధియైన
చిద్గగ నార్యుని శిష్యవర్య
సుజ్ఞాన దీపికఁ శుభముతో వెలిగించి
యజ్ఞాన తిమిరమ్ము నణఁగఁద్రొక్కి
సద్గురుమూర్తియై సచ్ఛిష్య గణముల
కరుణార్ద్ర దృష్టితో నరయు దనఘ!
భవబంధముక్తుఁడై భవ్యమై యలరారు
ఆనంద సామ్రాజ్యమందు నిల్పి
భవభయంబులఁ బోఁద్రోలు బ్రహ్మవిద్య
నార్జవంబున నేర్పుఁడీ! యనఘులార!
ఎఱుఁగఁ దెల్పెదరండని యెఱుఁగఁజెప్పి
మోదవార్ధిని ముంచెదే మునివరేణ్య!

సాధు సద్గురుమూర్తియై మధువులొలుకు
వచన రచనతొ తత్త్వోపదేశ మొసఁగి
ప్రణయ సాగరమునఁదేలు భక్తవరద
విమల విజ్ఞాన యోగీశ! విమలచరిత!

గాఢతిమిరమ్ములోఁబడి మూఢులకట!
జరరుజంబుల బారికి గుఱియుఁగాగ
అహాహా! భవరోగవైద్యుఁడై యలరఁజేతు
విమల విజ్ఞానయోగీశ! విమల చరిత!

సద్గురూ! సర్వమతములు సమములనుచు
భేదభావంబుఁ బోనాడి ప్రియము తొణుక
మందహాసోర్మిచలితుఁడై యందమొందు
శాంతమూర్తి! యోగానంద! సన్మునీంద్ర!

ప్రబలుఁజిమ్మెడు జ్ఞానంపు రతనమకట!
చోరులకుఁజిక్క యనలేని మెఱుగుమాయ
దరియు దాపును గానక తల్లడిల్లు
మొఱకుఁడను దేవనీదరిఁ జేరితయ్య

శాంతమూర్తి యోగానంద సాధువర్య
జ్ఞానజ్యోతిని వెలిగించు జ్ఞాననిలయః

# భాగ్యలక్ష్మి

ధూళిలో వీధులఁ దోఁగాడి దొరలాడు
        వికలాంగులను గాంచి-అకట! యనుచు
ఆకలి కోర్వక నల్లాడి యాకులఁ
        మేసెడి దీనులగాసిఁ జూచి
దరిదాపుఁగానక తారాడు యంధుల
        దైన్యంబుఁ దిలకించి తల్లడిల్లి
ఎంగిలి విస్తళ్ల కెందెందొ వెదకెడు
        భిక్షుకులను గాంచి ప్రేమఁ దొణుక

జాలి గుండెతోఁ దిలకించఁ జాల కీవు
అంతొ! ఇంతయొ! కడినిడి చెంతఁజేర్చి
సైరికుని భాగ్యలక్ష్మివై సౌరుఁ జిలికి
కలుష మెఱుఁగని గృహిణివై గ్రాలెదమ్మ!

చీకుఁ గంబళ్ళు ధరియించి యేకతమున
గోడ క్రిందనొ! వృక్షంబు నీడ యందొ!
కత్తి వేసిన రక్తంబుఁ గానరాని
తెల్లఁ బోయిన మోములఁ దల్లడిలుచు.

జీవితాశలు వదలియుఁ జవికి చెదరి
నిబిడ నైరాశ్య లహరిని నీదు నట్టి
దీన జనముల పాలిట దీపమగుచు
దరికిఁ దీయుదువమ్మరో ధర్మమెఱిఁగి

సైరికుని భాగ్యలక్ష్మివై సౌరుఁ జిలికి
కలుష మెఱుఁగని గృహిణివై గ్రాలెదమ్మ!
దీన జనముల పాలిట దీపమగుచు
దేశ దారిద్ర్యమును బాపు దేవి వీవె!

## వియోగము

౧

నీదు పరి రంభణమ్ములో నిదురఁ బుచ్చి
చేరఁ దీసితి వమ్మరో! చెలిమి నెఱపి
నీ వియోగమ్ము భరియించి నిన్ను వీడి
ఎందో! యే దూరదేశమో! యేగువాఁడ!

కాల వశమున యెడబాటు గలిగె మనకు
దూరమైపోదు ననుచును దూరకమ్మ!
పుట్టి పెరిగితి నీయందె పూరి గుడిసె!
మఱవ కాశీస్సు లొసఁగుము మమతఁ బెఱుఁగ

౨

స్వార్థ మెఱుఁగక సతతంబు స్వాంత మలర
పరుల కుపకృతిఁ దలపోసి పారు చుందు
వీవు కుల్యామ తల్లిరో! విమలమతివి
శైశవంబాదిగాఁగ నీసఖ్యమరసి

నీవియోగంబు భరియించి నిన్నువీడి
ఎందొ! యేదూరదేశమో! యేగువాఁడ
నీదు పరిసర సీమల నెపుడుఁదిరిగి
నట్టి, మమత నేరీతిఁబాయంగఁ గలనొ!

మఱవకాశీస్సు లొసఁగుము మాన్యచరిత
నాదుకుల్యామ తల్లిరో! యనుగు సఖుని
మఱవఁబోకమ్మ వందన మమ్మనీకు
దూరమైపోదు ననుచును దూరకమ్మ!

# సుధానిధి

పిల్లగాలులు లాలించి ప్రియముఁగొలుప
గర్భిణీ రాగిపొలములు కనులఁదనుప
చెదలు పురువుల బారుల చెలిమినరసి
నల్ల చీమల మైత్రికి నుల్లమలర

ప్రకృతి యొడిలోనఁ దీయగాఁ బాడుకొనెడు
నాదుజీవిత వీథుల నక్కటకట!
కంటకనికుంజములఁ దోసి కరుణమాలి
తెరమఱుంగునఁ జరియింతు తెలుగదేమి?

ఓసుధానిధి! రారమ్మ! గాసిఁదీర్చి
అమల హృదయంబుతోడ నన్నాదరించు!

## భాగ్యలక్ష్మి!

సాంధ్య వేళలందు శాద్వలంబుల యందు
గొట్టెలఆవు లందు గొల్ల లందు
కూలి చెలులయందు కొమరారు సెలయేటి
తటములందు, గిరుల తరువులందు

పూల తీవలందు పొలుపారు పొదలందు
ఆవు దూడలందు గోవులందు
సహజ సృష్టిలోని సారాంశమును గ్రోలి
భాగ్యలక్ష్మి వగుచుఁ బరగెదమ్మ!

## సుధానిధి

౧

అల్లువారెడు పల్లియ తల్లుఁజెల్ల
సురభిళమ్ములుఁ దొడఁగియుశోభఁ దనర
భావనారమ్య సీమలఁ బవలురేలు
హృదయ మానంద సరసిలో నీదులాడ.

ప్రకృతి యొడిలోనఁ దీయగాఁ బాడుకొనెడు
కవి కుమారుని దీవింప కరుణతోడ
రమ్మ! ఓ సుధానిధి! వేగ రమ్య మొదవు
నీదుఁయుప గూహనమ్ములో నొదుగఁజేసి

కవి కుమారుని దీవించి కరుణ మెఱయ
సతము లాలించి పేలించు సంతసమున.

౨

అల్లువారెడు సుకుమారవల్లి కలను
చీడపుర్వులు దండెత్తి పాడుచేయ
శోభఁ దఱిగియు నట్టులే సోలి పోవ
నద్భుతాశ్చర్య మగ్నుఁడై అరయరాని.

సృష్టి చిత్రంబు నెఱుఁగకఁ బ్రాకులాడి
నిబిడ నైరాశ్యలహరిని నీదుచున్న
కవికుమారుని దీవింప కరుణమెఱయ
రమ్మా! ఓసుధానిధి! వేగరమ్మా! రమ్మా!

౩

తల్లి యెన్నఁడో? దివికేగె-తండ్రివోయె
అన్నలును తమ్ములును లేరు-అకట నాకు
అక్కయొక్కతె! గతియాయె ననుచుఁ గుంది
నేదరులు కసిగందులు నెదుగుచున్న

నాదు కూనలఁ దిలకించి మోదమంది
ప్రణయ రాజ్యపురమతోడఁ బ్రణతులిడుచు
నెటులో? సంసార జలనిధి నీదులాడి
నాదు పథమున నేనేగ నడుమ నడుమ

గొంకు కొసరించుకయు లేని క్రూరురాలు
గరళ దంష్ట్రింబులనుజూపి ఉఱిమి చూచు
పాడు యస్పృశ్యతాభూత మెదురుఁగాగ
పెనుగులాడుచు ధృతిఁ బూని ప్రేమఁ జింద

ప్రకృతి యొడిలోనఁ దీయగా పాకుకొనెడు
ఈయభాగ్యుని దరిఁజేర్ప కేలనొక్కొ!
నిబిడ నైరాశ్య జలధిని ముంచెదెపుడు!
ఓసుధానిధి! రాగదే! గాసిఁ దీర్చి

ఆర్ద్ర హృదయంబుతోడ నన్నాదరించి.
సతము లాలించి పేలించు సంతసమున

# ప రి దా న మే మి త్తు?

చెమటోడ్చి కష్టించి చెలియరో పెంచిన
    నీదు యారామంబు నింపులొలికె
కంచెపై నల్లియు కసువిందు గొలిపెడు
    బీర తీవలకాంతి ప్రియముగులికె
పందిట నల్లియు పరిమళ మొలికించు
    మల్లె తీవలశోభ యుల్లమలరె
వరిపొట్లు విరిచెండ్లు మురిపెమ్ము గొల్పుచు
    నాహ్లాదమొనఁ గూర్చి నవ్యమొలికె

నీదు సౌందర్య దృష్టికి నిర్మలాంగి
మోదనార్ధిని దేలుచు ముద్దులొలుక
నీకు పరిదానమేమిత్తు నెఱుఁగఁదెల్పు?
మిదిగో! ముద్దులు చెల్లింతు ముదితగొనుము.

## భాగ్యమిమ్ము!

సెంటు జాజి పొదలు చెలువారఁ బుష్పించి
పరిమళమ్ముఁ గురియు వనులయందు
ఏకతమున నీతో నేకీభవించియుఁ
దిరుగు భాగ్యమిమ్ము దరియఁ జేర్చి

జాజి మల్లె పొదలు మోజుగా వికసించి
కనులఁ దనుపుచుండు వనులయందు
సౌరభమ్ముఁ గురియ సౌభాగ్యమొసఁగుచుఁ
జేరఁ దీయరమ్ము! చెలిమి నెఱపి

బొండు మల్లె పొదలు దండిగా విరులతో
శోభ గురియుచోట శుభము వెలయ
ఏకతమున నీతో నేకీభవించియుఁ
దిరుగు భాగ్యమిమ్ము! దరియఁ జేర్చి!

# లీనమైపోదాము!

అది శరత్కాలం. నిండు పున్నమరేయి. సుందరోద్యాన వనంలో పూల పొదరిండ్ల కడ కవి తన్మయుడై నూత్నభావానంద యోగంలో మగ్నుడై వుంటాడు. నవతారుణ్యమును గోల్పోని సుందరి యొకర్తుక అచటికి వచ్చి వయ్యారంగా విహరిస్తూంటుంది. ఆనవ మోహనాంగిని జూచి భావ భరితమైన మృదు మధుర భాషణములతో కవి పలుకరిస్తాడు. ఆబిడ రసభరితమైన మృదు మధుర భాషణములతో తన మనోభావాన్ని వెల్లిబుచ్చుకొంటుంది. వారిరువురకునుగల సంబంధ బాంధవ్యాలిందులో వర్ణింపబడ్డవి

౧

నిండు పున్నమరేయి దండిగా బూచి
చేమంతి పొదరిండ్లు చెలువమ్ము గుటియ
ధవళదుకూళమ్ము ధరియించి తరుణి!
విహరింతు వెవ్వరో! ప్రియమార దెల్పు?

౨

నిండు పున్నమరేయి నిగ నిగ లాడు
చేమంతి పొదలలో చెలువమ్ము గుటియు
కవికుమారుని జాడ గనుగొన వచ్చి
స్వైర విహారమ్ము సలుపుదు నోయి!

౩

చిక్కడు పొదరిండ్లు మక్కువమీర
కుసుమ గుచ్ఛములతొ మిసమిసలాడు
రమ్యస్థలంబులో రమణిరో! నీవు
విహరింతు వెవ్వరో! పిరియమార దెల్పు?

౪

కుసుమ గుచ్ఛాలతో మిస మిసలాడు
చిక్కాడు పొదరిండ్లు చెలువారు చోట
కవి కుమారుని జేర కాంక్షలు బొడమ
స్వైర విహారమ్ము సలుపుదు నోయి!

౫

పండు వెన్నెలరేయి పరిమళ్ళ నడుమ
కళలొల్కు తళతళ కనువిందు గొల్పు
ఈశరన్నిశివేళ యింపెస గంగ
విహరింతు వెవ్వరో! ప్రియమార దెల్పు!

౬

పండు వెన్నెలరేయి పరిమళ మొలుకు
పరిమళ్ల గనిమలజా వయ్యార మొప్ప
కవి కుమారుని జేర కాంక్ష లూరంగ
స్వేచ్ఛగా విహరింతు స్వాంతంబు సలర!

౭

స్వర్గసీమలతలు స్వాగతం బొసగ
జాజిమల్లె పొదలు సైగలు జేయ
సంపెంగ తీవలు సొంపెస లార
విహరింతు వెవ్వరో! ప్రియమార దెల్పు!

౮

స్వాంతంబు రంజిల్లు స్వర్గసీమ, సుమ
ములు బూచి విలసిల్లి ముదమారజేయు
ఈశ రన్నిశవేళ నిచ్చోట నేను
స్వైర విహారమ్ము సలుపుదు నోయి!

౯

కవితా కుమారివా? కడు చోద్యమయ్యె!
నీ దివ్య దర్శన మింపార గలిగె
ధన్యుడనైతిని తరుణీలలామ
కవి కుమారుడ నేను కరుణించు సఖియ!

౧౦

కరుణించుటయె గాదు కౌగిలందుంచి
లాలింతు రారమ్ము! లావణ్యసార
నా హృదయ కుహరాన ననవరతము
నివసింతువే సఖా! నిన్నెడబాసి.

౧౧

ఏకాంత వీధులకా యెటులుందు నేను
నీ హృదయమె నాకు నిలయమ్మె యొప్పు
నీ ధ్యానమే నాకు నింపెసలారు
ఏపూర్వ పుణ్యమో! యెఱుగంగ రాదు.

౧౨

నాలోన నీవును నీలోన నేను
లీనమై పోదాము లెమ్మోసఖా

సంపూర్ణము.